ఇంతలో యజ్ఞవాటిలో పాలకుం జంపిన ఆర్యకుని యథావిధిగా అభిషేకించి, అతని యుత్తరువుం గొని శర్విలకుఁడు చారుదత్తు విడిపింప వచ్చి, అతఁ డప్పటికే బ్రదికి వచ్చిన వసంతసేనం గూడియుంటం గాంచి, సంతసించి, చారుదత్తునికి తన్నుం దెలుపుకొని ఆర్యకరాజు నుత్తరువుం గొనివచ్చితి నని, దాన చారుదత్తునికి కుశావతిరాజ్య మొసఁగి వసంతసేనకు వధ్వవగుంఠనముం బ్రసాదించి, ఇఁక తా నక్కడ అన్నియు చారుదత్తునియిచ్ఛయుత్తరువుల మెయి చేయుదు నన్నాఁడు. ఇంతలో పట్టి కట్టి తేఁబడిన శకారుని, తన పాదాలలో వ్రాలి శర ణన్నవానిని, అందఱు ఏకవాక్యముగా చంపవలసినదని యనుచుండఁగా, ఎవ్వరిమాటను వినక, పోసఁగ మేలు చేసి పొమ్మనుటే 'చావు' అని విడిచిపెట్టి, వాని రాష్ట్రియత యందు ఎప్పటియట్ల నిలిపెను. వాఁడు బ్రతికినానురా బాబూ అని తిరిగి చూడక ఇల్లు చేరఁబోయెను.

ఇంతలో మఱొకవంక ధూతమ్మ ఎవరిమాటను వినక చారుదత్తుని యమంగళము వినకముందే నిప్పుమంటలం దూఁకెద నని సంభ్రమించుచుండెనని చందనకుఁడు వచ్చి చెప్పెను. ఎట్లో వసంతసేనంగూడి చారుదత్తుఁడును శర్విలకాదులును అక్కడికి పోఁగా చారుదత్తుఁడు రోహసేను నెత్తి ఱొమ్మున హత్తుకొని, ధూతమ్మను నిప్పువలన మాన్పి తేర్చెను. చారుదత్తుఁడు తన మిత్రుని పరిజనమును - అందఱిని కలసికొనెను. ఇట్లు ఇట్టి చావులు తప్పి కలసికొని అప్పుడే అభ్యుదయముం బొందిన వారిసంతోషమునకు మేరలుండునా! ఇక్కడ ఇందు గుఱుతు పెట్టఁబడిన ప్రభావములు - చూఁడు.

'అహో సత్యాః ప్రభావః
అహో ప్రభావః ప్రియసంగమస్య!
ప్రభవతి యది ధర్మో దూషితస్యాపి మేఽద్య.'

సంహారము - ముగింపు -

అన్నిటి నొక్కెడం గూర్చుట అను

పదియవ యంకము

ముగిసినది

# శ్లోకసూచి

Vedam Venkataraya Sastry & Bros, Madras - 1. 1974